*Dear Sri Rajagopalacharyulu garu ! I am extremely happy to hear that you have been awarded the Ph. D. on Chinnanna's Sahitya sameeksha. You rightly deserve the Honour and we are all proud of you. As a person associated with Annamacharya Sahitya Propogation, it is a very satisfying news to me. with Regards -*

**P. V. R. K. PRASAD,** I A S
**Chairman, Port Trust**
**VISAKHAPATNAM**

"ఆంధ్ర విశ్వకళాపరిషత్తు" వారు మిమ్ము 'డాక్టరేట్' నిచ్చి గుర్తించినందుకు ఎంతో ఆనందంగా ఉన్నది. మీరు ఇంకా ముందు ముందు ఎంతగానో సాహిత్య సరస్వతిని సమారాధించాలనీ, ఇంకా ఎన్నో అవార్డులు అందుకోవాలనీ అభిలషిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

'కరుణశ్రీ' **జంధ్యాల పాపయ్యశాస్త్రి**
గుంటూరు

"తాళ్ళపాక చిన్నన్న సాహిత్య సమీక్ష" గ్రంథము నిమిత్తము ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే పి. హెచ్. డి. పట్టమును చేపట్టినవారు ఆసేచనకమైనది. చేసిన కృషి సఫలమగుట భగవదనుగ్రహసిద్ధి. ఈ సందర్భమున హార్దమైన అభినందనములు, శుభాశంసనములు.

'కళాప్రపూర్ణ' **మధునాపంతుల సత్యనారాయశాస్త్రి**
రాజమండ్రి

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి పి. హెచ్. డి. పట్టం పొందిన సందర్భంగా హార్దికమైన అభినందనలు. "భద్రం భద్రాభిలాషిణామ్".

ప్రొఫెసర్ తూమాటి దోణప్ప
హైదరాబాద్

నా శిష్యులలో **Ph. D.** కష్టపడి సంపాదించిన వారిలో అగ్రేసరుడవు నీవే. నిన్ని సందర్భమున సముచితముగా సత్కరించిన వ్యక్తులను, సంస్థలను నేనభినందించుచున్నాను.

*డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు*
రాజమండ్రి

"తాళ్ళపాక చిన్నన్న సిద్ధాన్తకృతికి డాక్టరేటు బిరుదమును డంబుమీఱ
నందిన తరుణమందు నేనందజేయు నాశిషములివి "వర్ధిలుమా! సతంబు"

*డా॥ వేబోలు చిన్మయ బ్రహ్మకవి*
రాజమండ్రి

డాక్టరేట్ అందుకొన్నారు. మాకు గర్వకారణం. నాన్నగారి ఆశీర్వబలానికి తోడుగా మీ కృషి ఉన్నది. అందుకే ఫలించింది. అభినందనలు.

మధుర (సినీ) *కవి రసరాజు* - తణుకు

'తాళ్ళపాక చిన్నన్న సాహిత్య సమీక్ష' అనే పరిశోధనా వ్యాసమునకు ఆంధ్ర విశ్వ విద్యాలయమువారు 'డాక్టరేటు' ప్రదానము చేయనున్నారను వార్త పత్రికలలో చూచి చాల సంతసించినాము. మీరు పలు గ్రంథ కర్తలు, వినయ సంపన్నులు. పై పురస్కారమునకు మీరెంతయు తగియున్నారు. శుభాకాంక్షలు. భవిష్యత్తులో మీరు సాహిత్య సేవలో ఇంకను ఉన్నత శిఖరాల నందుకోవాలని, అందుకు తోడ్పడవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ-

*గరిమెళ్ళ అచ్యుతరామారావు*
అధ్యక్షులు : తెలుగు సాహితీ సమాఖ్య
తాడేపల్లిగూడెం






మీరు విజ్ఞాన క్షేత్రంలో కృషిచేసి పరిశోధించి పండించిన ఒక వ్యాసానికి విశ్వవిద్యాలయంవారు డాక్టరేట్ ఇచ్చుట సరస్వతిని గౌరవించడమే, మీ ప్రతిభకు గౌరవం లభించింది. మీ వంటి పండితుల వలన భీమవరం ప్రతిష్ఠ మరింత పెరిగింది. ఆపరాత్పరుడు మీకు ఆయురారోగ్యాలను సాహితీ సంపత్తిని ఇవ్వాలని కోరుచున్నాను.

*'అభినవ భోజ' గన్నాబత్తుల పెదతాత*

అధ్యక్షులు : రామరాజభూషణ సాహిత్య పరిషత్, భీమవరం

మీరు భీమవరం సాహిత్య సభలలో పాల్గొని రంజింప చేయటం చూసాను. అలాగే మీరు ఇది వరకు వ్రాసిన గ్రంథాలు చదివి ఆనందించాను. ఇప్పుడు పి.హెచ్.డి. డిగ్రీ పొందారంటే మరింత సంతోషంగా ఉంది. మీకు వేంకటేశ్వరస్వామి ఆయురారోగ్యములిచ్చుగాక! అని ప్రార్థిస్తున్నాను

*బొండా నాగేశ్వరరావు*

అధ్యక్షులు : కళా ప్రవంతి, భీమవరం

మీకు పి. హెచ్. డి. వచ్చినందుకు ఎంతగానో ఆనందించాను. తెలివైనవారు వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుంటారే తప్ప వాటికోసం ఎదురు చూసి ప్రాకులాడరు. అదేవిధంగా మీరు అవకాశాన్ని వినియోగించుకొని స్వయం శక్తితో **Ph. D.** సాధించారు. అభినందనలు.

*తటవర్తి వెంకటరత్నం* (ముత్తాత),

**Ex. Treasurer : D. N. R. College Associotion,**
భీమవరం.

తాళ్ళపాక చిన్నన్నను గురించి పరిశోధించిన అన్నన్నా- తెలుగు జాతికి మీ పరిశోధన ద్వారా అమూల్యమైన కానుక నందించారు. పరిశోధనా ప్రభాకరులు కావాలని ఆకాంక్ష. మీ అభ్యుదయం మాకు ఆనందం.

*చెఱుకువాడ వెంకట్రామయ్య*

విస్సాకోడేరు.



శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు సంప్రదాయ సిద్ధులు, సాహితీ మర్మజ్ఞులు. భావయిత్రీ కారయిత్రీ శక్తులు రెండును కలవారు. వారి ప్రభతికు వారి అన్న విజ్ఞానం, విశ్వనాథ శబరి గ్రంథాలు నిదర్శనాలు. వారు జన్మసంబంధంచేత, విద్యాసంబంధంచేత కూడ ఉత్తమమైన కోవకు చెందినవారు. వారి వంశం పండిత వంశం. ఎం. ఏ. పట్టాతో తృప్తి పడక సాహిత్య పరిశ్రమ చేసి ఎన్నో గ్రంథాలు ప్రచురించి ఎన్నో సన్మానాలు పొందారు. అధ్యాపకునిగా ప్రవృత్తి కల్గి ఉత్తమ ఉపాధ్యాయులుగా ప్రభుత్వంచే ప్రశంసల నందినవారు. మేధ, హృదయం—రెండు కలిసి పనిచేస్తేగాని అవగాహన గాని విషయాలను వారు అవగాహన చేసుకొన్న మనీషి. వారి జీవితంలో సాహిత్యం – ఆధ్యాత్మికత పెనవేసుకొని ఉండటంచేత వారి విమర్శకు అటువంటి విషయాన్నే తీసుకొని సిద్ధినొందినవారు. పరమార్థం అధ్యయనం బోధనం మాత్రమే కాదు ఆచరణ ప్రచారాలు ఉంటేనే దానికి శోభయని నిరూపించిన ఉత్తమోపన్యాసకులు. వారి విమర్శనా పటిమకు నికషంగా ప్రస్తుతం చిన్నన్న ద్విపద సాహిత్యంపై ఒరపిడి పెడుతున్నారు. రసిక భావుకలోకం చవిచూచి, ఆనందింతురుగాక !

— ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్

**శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**విశాఖపట్టణం**